8. ఇరవై మూడేళ్ళ క్రితం, అటుపిమ్మట చాలా ఏళ్ళ వరకూ, నా నరాలూ, పేగులూ సలుపుతెత్తేవి. ఉన్న బాధంతా ముఖ్యంగా వాటివల్లనే. ఇట్టే అవి ప్రకోపించేవి. విరేచనం వొక్కొక్కప్పుడు కొంచెం నీళ్ళనీళ్ళగానూ, తరుచు గట్టిగానూ రోజూ గాలుగయిదుసార్లు అవుతూవుండేది. తీసుకున్న ఆహారం అరిగేది కాదు.

9. 1891 వ సంవత్సరంలో వొకనాటి ఉదయం పది గంటలకు వొక కొండను అధిరోహించ ఆరంభించాను. శీతా కాలం. ఎండకాస్తున్నది. తలమీద ఎండ పడుతూనే వుంది. తలపాగా లేదు. గొడుగూ లేదు. కొండమీదవున్న భవంతికి త్వరత్వరగా చేరాలనే ప్రయత్నంతో అడ్డుదారిని గబగబ నాలుగడుగులు వేశాను. కొండ శిఖరం మీద నాలుగడుగులు వేసేసరికి ఆయాసం లావయింది. మూర్ఛ వచ్చినట్లయింది. కొన్ని సెకండులపాటు స్పృహాకూడా తప్పింది. నాటి సాయంకాలంనుంచీ తలతిప్పడ మారంభించింది.

10. అదే పనిగా ఏదో ఒక ఆలోచనా పూర్వకమైన పనిచేయడంవల్ల, మేధస్సుకు శ్రమ కలిగించడంవలన నా నరాలు పట్లు తప్పాయి. నరాల బలహీనత హెచ్చింది. దాంపత్య సుఖం అనుభవించిన తరువాత మేధస్సు ఉద్రేకం కాజొచ్చేది. నిద్రపట్టేది కాదు. ఒకొక్కప్పుడు భుజాలగూళ్లు సలుపుతెత్తేవి. నాకు నిద్రలేమి అనేజబ్బు ఎలాగూవుంది; అయినా కాఫీ తీసుకోవడం మానేనుకాను. నేను కాలేజీలో లెక్చరరుగా వుండేవాణ్ణి. అదే పనిగా గ్రంథాలను పరిశీలించడం అలవాటై పోయింది. కొంతకాలానికి పరిశీలన మాటకేమి, పుత్తినే పుస్త

కంలోని అక్షరాలను చదివితే చాలును, తల భారమయేది. మేధస్సుకు శ్రమ కలిగేది. రెండడుగులు అలా నడిచివెళ్ళడమంటే ప్రాణాంతకం.

11. సరే; ఇక నాకు మరణం తప్పదనుకున్నాను. కాని * స్వర్గస్థులైన మహారాజావారు నన్ను చెన్నపట్నం తీసుకువెళ్ళి డాక్టర్ బ్రౌనింగ్‌కు చూపించారు. రైలుప్రయాణం భారమైనా నేను మదరాసు వెళ్లాను. ♦ డాక్టరు బ్రౌనింగు నన్ను పరీక్షించాడు. నా శరీరంలోని నరాల నిర్మాణపద్ధతి పూర్తిగా చెడిపోయిందని చెప్పాడు. కాని నేను చాలాకాలం బతుకుతానని అన్నాడు. భోజనంతో పాటు ప్రతిసారీ యివి పుచ్చుకోవాలని ఆదేశించాడు: అరోమెటిక్ కన్ ఫెక్షన్ అయిదు గ్రెయినులు; బిస్మత్ ఐదు గ్రెయినులు; పెప్సిను అయిదు గ్రెయినులు.

నరాల సత్తువకు తాను నాకు అప్పట్లో మందు యివ్వలేదు. అలా యిచ్చినట్లయితే ప్రయోజనం లేదన్నాడు. కారణం అప్పట్లో నా కేమాత్రం చురుకుకలిగించే ఏమందు వాడినా, నా నరాలు వాటిని గ్రహించేస్థితిలో లేవట. ఏం తీసుకున్నా నరాలు చలించిపోతాయట. అందువలన సాత్వికమైన వొక టానిక్‌ను పుచ్చుకోమన్నాడు. ఇది రాత్రిళ్ళు సేవించే ఔషధం. ఇందువల్ల రాత్రిళ్ళుజరిగే వీర్యస్ఖలనం

* ఆనంద గజపతి.

♦ మద్రాసుప్రభుత్వ ప్రఖ్యాత సర్జను డాక్టరు బ్రౌనింగు అప్పారావు గారిని పరీక్షించి యిచ్చిన సలహా, ఆయనతో కావించిన యింటర్‌వ్యూ విశేషాలు 1895, మార్చినెల 31 వ తేదీ డైరీలో కలవు. చూ. 34 వ పేజీ.

కట్టడుతుంది. బెలోడోనా; హెయసిమస్; కేంఫర్; ఇవి కాక కాడ్‌లివరాయిల్ కొద్ది కొద్ది మోతాదులుగా యివ్వడ మారంభించారు.

12. కొన్నాళ్ళకి కొంచెం నయమయింది. ఆరోగ్యం బాగుపడింది. కాని అయిదు నెలలయాక బ్రోన్కైటిస్ వ్యాధీ, జ్వరమూ పట్టుకున్నాయి.

అయితే నా అనారోగ్యంవల్ల నాకొకటి కలసివచ్చింది; అదృష్టమే మరి. డాక్టర్ బ్రౌనింగ్ వూళ్ళో లేకపోవడంవల్ల డాక్టర్ నంజుండరావు మందు యిస్తూవుండేవాడు. ఆయనా, నేనూ స్నేహితులమయాం. రాత్రుళ్ళు బాగా కాగినపాలూ, యింత అన్నమూ తినమని ఆయన సలహా యిచ్చాడు. అప్పటికి నా వయస్సు ముప్ఫైమూడు. బరువు డబ్భైఎనిమిది పౌనులు. జ్వరం కాయడంవల్ల ఆరు పౌనులు తగ్గిపోయినాను.

13. పాలు తాగడం యెందుకు మానేశానో కారణం మీాకు ఇదివరకే చెప్పాను. నాలుకకు అల్సరు వచ్చింది. ఇక పాలు తాగవద్దన్నారు. సరే నన్నాను. పాలు పుచ్చుకోవడం వల్ల పొద్దున్నే విరేచనం బాగా అయేది. మలబద్ధకంగావుంటే కాసిన్ని పాలు ఎక్కువ తీసుకునేవాడిని. ఇప్పుడు పాలు వొంటికి పడవు. కడుపులో యాసిడు పుట్టుకొస్తుంది.

14. 1894–95 మధ్యకాలంలో నాకు కలిగిన యితర బాధలు యివి: తల వెనకభాగం సూదులతో గుచ్చినట్టు, దబ్బళాలతో పొడిచినట్టు చురుక్కుమనేది. ఒక ఏడాదిపాటు బాధపడ్డాను. తరవాత తగ్గిపోయింది.

15. రోజూ మూడుపూటలా భోజనం చేసేవాడిని; సాయంకాలం నాలుగు గంటలకు టిఫిను తీసుకునేవాడిని. ఒకొక్కప్పుడు కొన్ని వారాలపాటు అన్నానికి బదులు పొద్దున్నే పాలూ, కాఫీ తీసుకునేవాడిని. ఇలాగ పాలూ, కాఫీ తాగుతున్నప్పుడు మధ్యాహ్నం వేళల విరేచనం కొంచెం గట్టిగా అయేది; నల్లగావుండేది.

16. విపరీతమైన బడలిక, ఆయాసం నాకు బాల్యం నుంచీ వున్నదే. నా శరీరతత్వమే అంత అనిపించేది. చాలా బక్కపల్చటి మనిషిని. కాని నేను కావించేకృషి, మేధో సంబంధమైన కార్యాచరణా అత్యధికం. నేనింత కృషి ఎలా చేస్తున్నానా అని నా మిత్రులకేకాదు, నాకే ఆశ్చర్యం వేసేది. ఎప్పుడూ పక్క మీంద అలా వాలి, విశ్రాంతి తీసుకోవాలనిపించేది. శారీరక కష్టమంటే యిష్టముండేది కాదు. ఇంత ఆయాసంగావున్నా యింత బలహీనంగావున్నా పోనీ ఆలోచనలకు విశ్రాంతియిచ్చానా! లేదు; మేధస్సును అదేపనిగా శ్రమపెడుతూ వచ్చాను. నిన్న మొన్నటివరకు నేను కావించిన మూర్ఖప్పని యిదే.

17. ఇప్పుడు నాకు కలిగిన రుగ్మత యిది: పూర్తిగా నరాల బలహీనత. జీర్ణకోశం చెడిపోయింది. నరాలకు పోకు కలిగినా, నా ఆరోగ్యం చెడిపోతున్నదే అనే వ్యాకులతవలనా శరీరం మార్పుచెందేది; మలబద్ధంపోయి విరేచనమయేది. ఇది యిదివరకటిమాట. ఇపుడు అదీ లేదు. నరాలకు ఉద్రేకం కలిగినా మలబద్ధం మలబద్ధమే. దీనికితోడు జ్వరం.

ఈ జ్వర లక్షణాలు బర్నేయూ మాన్యుయలు మొదటి వాల్యూములో రెండువందల మూడవ పేజీలో పేర్కొనబడిన జ్వరలక్షణాలను పోలి వుంటవి. కడుపులో యాసిడు చేరినట్టు వుంటుంది. చారు తాగినా, మజ్జిగ పుచ్చుకున్నా యిది ఎక్కు వవుతుంది. కడుపు నొప్పి ఆరంభమవుతుంది. జీర్ణించుకుందుకు కొంచెం కష్టమైన ఆహారం, లేదా మలబద్ధం కలిగించేమందులు వాడినా, కడుపునొప్పి అధికమవుతుంది. అయితే యిది అరుదు. ఎనిమా చేసుకుంటే తప్పక ఉపశమనం కలుగుతుంది. ఆముదం మొదలైనవి అసలే పడవు. మా డాక్టరు యీ మిక్స్చరు వాడ మని చెప్పాడు: మాగ్నెల్ఫ్ వొక ఔన్సు; సోడిసల్ఫ వొక ఔన్సు; సోడా బైక్రోబ్ పది గ్రెయినులు.

ఈ మిక్స్చరు ఆరుడ్రాములు తాగితే ఆరేడు నీళ్ళవిరే చనాలవుతాయి. మొన్న వేసవిదాకా నేనెప్పుడూ పర్గేటివు తీసుకోలేదు. పాలుతాగితే చాలుననిపించేది.

ఇప్పుడు ఎనిమిదిడ్రాముల మిక్స్చరు వాడినా ఫలితం కనిపించడం లేదు. అందుకని మూడు డ్రాముల ఆముదం తాగేను. కాని దీనితో నాపని తలకిందులైంది. గత్యంతరంలేక ఎనిమా చేసుకున్నాను. రెండుమూడు రోజులవరకు సవ్యంగానే వుంది.

ఇప్పుడు నేను తీసుకుంటున్న ఆహారం.

(అ) ఉదయం ఆరుగంటలకు మెల్లిన్సుఫుడ్ ఆరు చెమ్చాలు. నిండు చెమ్చాలు కావు. (ఆ) పదకొండు గంటలకు అన్నం, చప్పిడి కూర; వాడే కూరగాయలు యివి: ఆనప

కాయ; పొట్లకాయ; వంకాయలు. (౩) రాత్రి ఏడుగంటలకు మధ్యాహ్నంవలె మామూలు భోజనం.

నూకలు వేయించి జావ చేసుకుని యీ మధ్య పుచ్చుకునేవాణ్ణి. కాని ఆయుర్వేద వైద్యులు, వేయించిన నూకల జావ మలబద్ధకం కలిగిస్తుందని చెప్పడంవల్లమాని వేశాను. ఇపుడు మళ్ళీ పుచ్చుకుంటున్నాను. నాకిప్పుడు జావలాంటి పదార్థం సులభంగా జీర్ణమయేది తీసుకోవాలని వుంది. మలబద్ధంపోయి జ్వరం తిరుగుమొహం పెట్టాలి. నరాల బలహీనతవల్ల కొంత, మందుల విషంవల్ల మరికొంత నాకు ఉష్ణం వచ్చి వుండవచ్చును. నెల క్రితం నా టెంపరేచరు నూటమూడు డిగ్రీలు. మెల్లిన్సుఫుడ్డూ, నూకలజావా మూడు నాలుగు రోజులు పుచ్చుకున్నాను. అప్పటికి టెంపరేచరు నార్మలుకు వచ్చింది. మధ్యాహ్నం ఒక పూటే భోజనం చేసేవాణ్ణి. తరవాత రాత్రుళ్ళుకూడా భోజనంచేశాను. మధ్యాహ్నం భోజనమయాక టెంపరేచరు వచ్చింది. మెల్లిన్సుఫుడ్డూ, నూకల జావా తీసుకోవడంవల్ల టెంపరేచరు తగ్గినా, ఆ తగ్గడంతో పాటు నీరసంకూడా పుట్టేది. అన్నంతింటే నిస్త్రాణ వుండేది కాదు. కొంచెం దారుఢ్యంగా వున్నట్టనిపించేది. నిన్న రాత్రల్లా నిద్రపట్టలేదు. ఇప్పుడు ఉదయం ఏడుగంటలయింది. టెంపరేచరు నూరు డిగ్రీలు. ఇదంతా నేను చెప్పగా వ్రాయబడ్డ నివేదిక.

1౭. జ్వరం కాస్తున్నపుడు కడుపులో మంటపుట్టినట్లుంటుంది. రొమ్ము, భుజాలు, ప్రత్యేకంగా ఎడమభాగం నొప్పెడుతున్నాయి. నూరు డిగ్రీల జ్వరం వచ్చినా, నొప్పి కలగనపుడు

కొంత బాధనిపించదు. టెంపరేచరు, నార్మలుకు వచ్చిందా ప్రాణం తెరిపిన బడినట్లుంటుంది. బాధలేదు. పనేమీ లేకుండా పూర్తిగా విశ్రాంతి తీసుకుంటూ కూచోడం నావల్ల కాదు. అయితే ఎంత విశ్రాంతిని భరించగలనో అంత విశ్రాంతీ నేను తీసుకుంటూనే వున్నాను. నాలాగ జాగ్రత్తగా ఆహారం తీసుకోనే వాళ్ళుంటారని నేననుకోను. జ్వరంగా వుంది. జ్వరంతో ప్రయాణం చేయడమంటే భయంగానేవుంది. లేకపోతే మద్రాసు వచ్చి వైద్య సలహా తీసుకునేవాడినే.

19. నాకు వస్తోన్న జ్వరం రెండు రకాలు: ఒకటి అప్పడప్పడు వస్తూ వుంటుంది. కంఠంలో నొప్పి బయలుదేరి నప్పడు, బ్రోన్కైటిస్ వచ్చినప్పడు, రక్తంలో విషసంబంధమైన పదార్థాలు చేరినప్పడు యిది వస్తుంది.

అప్పుడు నీరసం హెచ్చుతుంది. చికాకు లావవుతుంది. అవయవాలు పీక్కుపోతాయి. కొంచెం చలివేస్తుంది. ఇప్పుడు వచ్చిన జ్వరం మామూలుగా వచ్చే ఉష్ణంకాదు. సాధారణంగా నాకు ఆకలి బాగానే వేస్తుంది.

ఇప్పడు వచ్చిన నా జ్వరానికి ప్రధాన కారణం యిదను కుంటాను: జూలై మాసం యిక వెళ్ళిపోతుందనగా ఆఖరి వారంలో నా కొకనొకజున నూటవొకటి డిగ్రీల జ్వరంవచ్చింది. జ్వరంరాడానికి ముందు ఆవేళ నేను చాలా శ్రమపడ్డాను. శ్రమంతా ఏదో ఒకటి చదవడం, రాయడం; ఆలోచనలకు శ్రమ కలిగించడంవల్ల టెంపరేచరు హెచ్చింది. కాని తగ్గింది; మళ్ళీ మూడురోజులూ ఈ మధ్య రెండుసార్లు టెంప

రేచరు హెచ్చింది. మా డాక్టరు బహుశా యిది మలేరియా అయివుంటుందనుకున్నాడు. నాకు చలిలేదు. ఆకలి గాగానే వేస్తుంది. ఎందుకైనా మంచిది ముందే జాగ్రత్త తీసుకుందామని మా డాక్టరు రెండున్నర గ్రెయినులు క్వైనైను వాడమన్నాడు. రోజుకు రెండుసార్లు క్వైనైను తీసుకున్నాను. ఒకరోజున మాకెవరికీ తెలియకుండా ఒక పొరపాటు జరిగిపోయింది. డిస్పెన్సరీలో మందు ఎవరిచ్చారోకాని క్వైనైను మోతాదు రెండున్నర గ్రెయినులకు బదులు అయిదు గ్రెయినులకు పెరిగింది.

నేను రెండు గ్రెయినుల క్వైనైన్‌కు మించి ఎప్పుడూ తీసుకోలేదు. అందువల్ల యీ ఐదు గ్రెయినుల మోతాదూ నాకు చాలా అవస్థ కలిగించి వుండాలి. దానితో నా కడుపూ, నరాలూ, పేగులూ చెడిపోయి వుంటాయి.

## అనుబంధం

1. మలబద్ధం వచ్చినపుడు నూటవొకటీ, నూటరెండు డిగ్రీల జ్వరం వుంటున్నదని డాక్టర్ బర్నేయో చెబుతున్నాడు. కొంతమంది డాక్టర్లు యింతకంటె హెచ్చుజ్వరమే వస్తుందంటు న్నారు. ఈ జ్వరం కాసినపుడు తలనొప్పి, నాలికపై ముళ్ళు పుడతాయి. నోరు పూస్తుంది. ఆకలి పుట్టదు. నాకు వచ్చిన జ్వరం యిలాంటిదే ననుకుంటాను.

2. గత నాలుగయిదు మాసాలలో నాకు అయిదారు సారులు జ్వరమొచ్చింది. తిన్న ఆహారం అరగలేదు. తీసుకున్న

ఆహారం మంచిదీ కాదు. అందువల్ల కడుపునొప్పి ఆరంభమయింది. సరే; ఇక మలబద్ధం, అటు తరవాత జ్వరం రానే వచ్చాయి.

ఇప్పుడు నాకు జ్వరం వచ్చినా, నాలిక మామూలుగానే వుంది. ఇంతకు ముందెన్నడూ నాకు తల నొప్పిపెట్ట లేదు. ఎండలు ముదరడంవల్ల ఏప్రియలు ఎనిమిదో తేదీ నుంచి తలనొప్పి ఆరంభమయింది. ఇప్పుడు ఆకలి మటుకు బాగానే వేస్తోంది. ఉష్ణంవల్ల ఆకలి తగ్గలేదు. జ్వరం నూట వొకటి డిగ్రీలకు మించినట్లయితేమాత్రం ఆకలి చచ్చిపోతుంది. నాకు జ్వరం రావడానికి కారణాలు రెండు.

3. మొదటి కారణం: మధ్యాహ్నం వొంటిపూట తిండి. ఇంత అన్నం తినడమారంభించాను. అప్పుడు టెంపరేచరు తొంభై తొమ్మిది డిగ్రీలు. *ఇందుతో జతపరచిన పట్టిక ఫిబ్రవరి పదిహేనువరకూ చూడండి. అటుపిమ్మట రాత్రుళ్ళు

* ఫిబ్రవరి పట్టిక లభించినది కాదు. కాని శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారికి వ్రాసిన లేఖలో జతచేసిపంపిన పట్టికలో మార్చి నెల 1 వ తేదీ 1915 న మహాకవి శరీర ఉష్ణోగ్రత: ఉదయం యేడుగంటలకు 98.4; తొమ్మిది నలభై అయిదు నిముషములకు 9[illegible].4; పదిన్నరకు 99.6 పదకొండున్నరకు 100.8; మరొక పావుగంటకు 100.6; మధ్యాహ్నం వొంటిగంటా నలభై అయిదు నిముషములకు 100.8; మూడుగంటలకు 100.2; నాలుగు గంటలకు 100.8; నాలుగున్నరకు 100.4; ఏడూ యాభైకి 100; తొమ్మిదింటికి 99.3.

మర్నాటి టెంపరేచరు :

ఉదయం ఆరున్నరకు 98; ఎనిమిదిన్నరకు 98; తొమ్మిది గంటలకు 93.4.

కూడా తినిచూద్దామనుకున్నాను. టెంపరేచరు 99.6 డిగ్రీలకు హెచ్చేది. ఫిబ్రవరి 19 వరకు ఇలాగ నేవుంది. తరవాత రెండురోజులూ టెంపరేచరు 99.8 డిగ్రీలు. ఇరవై రెండో తేదీన నూరు డిగ్రీలు. జావా అవి తాగితే టెంపరేచరు తగ్గవచ్చును. మెల్లిన్సుఫుడ్డూ, జావా తీసుకున్నాను. నీరసం అధికమయింది. అన్నం తింటే నిస్త్రాణగా వుండదు. బలంగానే వుంటుంది. కొన్నాళ్ళు అన్నమే తిన్నాను. నిస్త్రాణ పోయింది. కాస్త జవసత్వాలు వచ్చాయి. కాని కడుపులో ఆసిడ్ చేసినట్లు అనిపించింది. చింతపండు వాసన తగిలిందా యిది ఎక్కువవుతుంది. మజ్జిగ పడదు.

4. ఇక రెండవ కారణం: ఎండవేడ కిట్టదు. ఎండలో నాలుగయిదు నిముషాలయినా నిలవలేను. ఎండబాగా కాసిందా ఆనాడు నేను ఏదైనా పనిచేస్తినా జ్వరం వచ్చేస్తుంది. ఆవేళ ఏమీ చదవనూకూడదు; రాయాన్నీకాదు. నాకు విశ్రాంతి అవసరమవుతుంది. ఇప్పుడు పనీ పాటూ లేదు. విశ్రాంతి తీసుకుంటున్నాను.

5. మధ్యాహ్నం నిద్రపోకపోయినా, టెంపరేచరు విధిగా హెచ్చిందన్నమాటే. హెచ్చడంలోనూ అలా యిలా కాదు; త్వరత్వరగా కొన్ని సంవత్సరాలనుంచీ వస్తూ పోతూ, హెచ్చుతూ, తగ్గుతూవున్న యీ టెంపరేచరువల్ల నా శారీరక తత్వమే అంత అనుకున్నాను. ఏమాత్రం ఉద్రేకం కలగకుండా నరాలకు శక్తి కలిగించాలి.

6. నరాల బలహీనతతప్ప మరొక వ్యాధేమీ నాకు లేదు. మిగిలిన అవయవాలన్నీ బాగానేవున్నాయి. నిన్న నూకల

జావ తాగాను. పొద్దున్న ఏడుగంటలకి మెల్లిన్సుపుడ్డూ, పన్నెండుగంటలకి జావా పుచ్చుకున్నాను, రాత్రి ఏడుగంటలకి మెల్లిన్సుఫుడ్డూ, కాసిన్ని పాలూ తీసుకున్నాను. దానితో ఎక్కిళ్ళు ప్రారంభమయ్యాయి.

♦ ఎండవేడి యెక్కువవుతున్నకొద్దీ కొంప రేచరు లావవుతోంది. కాని జ్వరానికి ప్రధానకారణం అజీర్ణం. మలబద్ధం. నాకు కాస్త మంచి ఆహారం కావాలి. తినగానే జీర్ణమయితే మంచిది. అయితే మెల్లిన్సుఫుడ్డూ, జావామాత్రం వొద్దు. అవి పుచ్చుకుంటే చెప్పలేనంత నిస్త్రాణగా వుంటోంది. నా జీర్ణకోశం చెడిపోయింది.

---

♦ ఇక్కడనుంచి యీ చివరినాలుగు పంక్తులూ ఆయన స్వదస్తూరితో వ్రాసినవి. మిగిలిన భాగమంతా ఆయన చెప్పగా వ్రాసినది. టైపుడు కాపీ.

# *శ్రీ అప్పారావుగారి నిర్యాణం

## విజయనగర విద్యావేత్త

30 నవంబరు, విజయనగరం :

చాలా కాలంనుంచి వ్యాధిగ్రస్తులై వున్న శ్రీ గురజాడ వెంకట అప్పారావుగారు తమ ఏభై నాలుగవయేట నేటి ఉదయం తమ స్వగృహంలో పరమపదించారు. వీరు విజయనగర కళాశాలలో విద్యనభ్యసించి పట్టభద్రు లయారు. అదే కళాశాలలో పెక్కు సంవత్సరాలు ప్రొఫెసరుగా వుద్యోగం చేశారు. తరువాత ఆనందగజపతి మహారాజావారి అంతరంగిక కార్యదర్శిగనూ, పిమ్మట డవేజరు మహారాణి, రీవామహారాణిల అంతరంగిక కార్యదర్శిగనూ పనిచేశారు.

మదరాసు విశ్వవిద్యాలయంలో తెలుగుభాషకు పరీక్షాధికారులుగ శ్రీ అప్పారావుగారు కొంతకాలం నియమితులు. మూడేళ్ళక్రితం సెనేటుకు సభ్యులుగ వీరిని ప్రభుత్వం నియమించింది. వీరికి ఆంగ్లకవిత్వమంటే మిక్కుటమైన ఆసక్తి కలదు. శ్రీ అప్పారావుగారు రచించిన ఆంగ్లగీతాలు, 'రీస్ అండ్ రయత్' సంపాదకులు స్వర్గీయ డి. వి. శంభుచంద్ర ముఖర్జీగారి ప్రశంసల నందుకొన్నవి. శ్రీ అప్పారావుగారు తెలుగుభాషలో కన్యాశుల్కమనే నాటకమును రచించారు. తాము అంతరంగిక కార్యదర్శులుగవున్న సమయంలో సంస్థాన పరిపాలనను దక్షతతో నిర్వహించడానికై తమ పలుకుబడి నంతటినీ వినియోగించారు.

---

* ఇది మద్రాసు మెయిలు దినపత్రికలో ప్రకటితమైనవార్త.

(శ్రీ) అప్పారావుగారి మృతికి సంతాపసూచకంగా నేడు మహారాజావారి కళాశాల మూసివేయబడింది.

## Death of G. V. Appa Row

### A Vizianagram Educationist

Vizianagaram, Nov. 30.—Death took place here this morning of Mr. G. V. Appa Row, aged 55, after a long illness Mr. Appa Row graduated from the Maharaja's College, in which he lateron served the best part of his life as Professor. Latterly he was appointed Private Secretary to the late Maharaja Anandaraja and served in this capacity under the late Dowager Maharani and Rewa Maharani. He was an examiner in Telugu for the Madras University and a nominated member of the Senate three years ago. He had a great liking for English poetry and wrote some verses which were highly commended by Mr D V Sambhu Chunder Mukherji, late Editor of *Reis and Rayyet* He has written a drama in Telugu called *Kanyasulkam* As Private Secretary his influence was exerted in the better administration of the estates. The Maharaja's College was closed to day in honour of his death.—(A.P I)

## చివరి చిరునవ్వు

నవంబరు నెలలో ఇరవైతొమ్మిది రాత్రుళ్ళు గడిచి పోయాయి. తెల్లవారింది. మహాకవి జీవితంలో అదే తుది ఉదయమని ఎవరూ కలలోకూడా అనుకోలేదు.

మేడమీదగదిలో మంచం మీద మహాకవి మామూలుగానే దుస్తుల్ని ధరించి పడుకున్నారు. మంచం పక్క కొడుకూ, ఎదుట డాక్టరు మంగయ్యనాయుడుగారూ దిగు

లుగా నించున్నారు. మహాకవి తల్లీ, పిల్లలూ, బంధువులూ ఆందోళనతో అటూ, ఇటూ తిరుగుతున్నారు.

బయటకిటికీలోంచి ఎండపొడ గదిలోపడుతున్నది. చలి గాలి దొప్పుకొస్తున్నది. రొజ్జగాలీ, ఎండపొడా, మహాకవికి పడవు కదా !

దగ్గర నిలబడిన వారిని మెల్లగా దరికిపిలిచి మహాకవి, తాము ధరించిన దుస్తులన్నీ తీసివేయమన్నారు. వొక్క స్లానలు లాల్చిని మాత్రం వుంచుకున్నారు.

తన మంచం ప్రక్కనే దిగులుగా నించున్న కొడుకును చేరువకు రమ్మని పిలిచి "కొంచెం కొకోనైనూ, దంపిన తాంబూలమూ తెచ్చిపెట్టు బాబూ!".

వీటిని తండ్రి తీసుకుంటే ఏమవునో అనే భీతితో కొడుకు, డాక్టరు నాయుడుగారిని చూపులతో ప్రశ్నించారు. డాక్టరుగారు ఇవ్వవచ్చునని తల ఊపారు. కొడుకు తండ్రికి వాటిని అందిచ్చారు.

తాంబూలము చప్పరిస్తూ మహాకవి, డాక్టరుగారి చేయి పట్టుకుని "వీటిని వేసుకో వచ్చునో, కూడదో, నేను బతికుంటే ఆహారశాస్త్రం మీద వొక గ్రంథం రాస్తాను, డాక్టరుగారూ!" అంటూ చిరునవ్వు నవ్వారు.

అదే మహాకవి చివరి చిరునవ్వు. అదే ఆయన తుది పలుకు. అప్పటికి గోడనున్న గడియారం ఎనిమిదిదాటి ఇరవయ్యెనిమిషమువద్ద ఆగిపోయినది !

# * కీర్తిశేషులైన గురజాడ అప్పారావుగారు

"......వీరు సామాన్య స్థితిగల కుటుంబమున జన్మించినవారు. విజయనగర సంస్థానమున వీరితండ్రి అమీనుగా నుండిరి. వీరి పూర్వీకులు గ్రామకరణములుగా నుండినవారు. వీరు చదువుకొనునప్పుడును సుఖముగా గాలము గడిపినవారు కారు......పండిత చంద్రశేఖరశాస్త్రిగారి ప్రోత్సాహమున వీరికి సంస్కృతమునకు నభిలాష మెండుగనుండెను.......వీరు కళింగదేశ చరిత్రను వ్రాయు నుద్దేశమున తదనుకూలసామగ్రి సమకూర్చిరనియు దానిని ఆధారంచేసికొనియే విజ్ఞానచంద్రికా మండలివారికి గ్రంథమువ్రాసి యిచ్చుటకు నంగీకరించిరనియు వాకుకయున్నది. ఈపని జరిగియుండినందున వారు సంతరించిన సామగ్రిని ఆవిషయమెరిగిన వారియొక్క సమర్థమిత్రు లెవ్వరైనను నుపయోగించుకొని గ్రంథమువ్రాసిన యెడల మిక్కిలి యుపయోగకరము కావచ్చును.........వీరు మహారాజులుంగారికి ఆంతరంగిక కార్యదర్శిగా నున్నప్పుడే వీరి ప్రోద్బలముననే విజయనగరము మహారాజుగారి ఆంగ్లకళాశాలయు సంస్కృత కళాశాలయు రెండును స్థిరపడినవని తెలియుచున్నది...... రచకులుగా మాత్రమే గాక అప్పారావుగారు ఆంధ్రభాషా పక్షమున విశ్వవిద్యాలయ సభ్యులుగను, పరీక్షకులుగను ప్రశంసనీయమగు పరిశ్రమచేసి రనుటలో తప్పేమియు లేదు. వాఙ్మయ పక్షపాత మింతకలిగి గంజాము విశాఖపట్టణ

* ఇది వొక తెలుగుపత్రిక వ్రాసిన సంపాదకీయం. ఆ పత్రిక పేరు తెలియదు. సంపాదకీయములోని కొన్ని భాగములు యిక్కడ పొందుపరుస్తున్నాము.

మండలములలో ప్రాముఖ్యతవహించి శాంతులై ఎదుటివార లను మర్యాదించుటలో నసామాన్యులై దంభములేక పని చేయుచుండిన అప్పారావుగారివంటి పుత్రుని గోల్పోయిన యాంధ్రమాత మిక్కిలి దుఃఖించుననుటకు సందేహములేదు. ఆమెకును, అప్పారావుగారి కుటుంబమునకును మా సానుభూతిని తెలియజేయుచు వారి ఆత్మకు శాంతికలుగును గాక యని ప్రార్థించుచున్నారము.

## * మదరాసులో సంతాపసభ

శ్రీ గురజాడ అప్పారావుగారి మృతివలన ఆంధ్రదేశానికి వాటిల్లిన తీరని నష్టానికి దురపిల్లుతూ నిన్న సాయంకాలం ఆండర్సన్ హాలులో తెలుగు రీసెర్చిసొసైటీ ఆధ్వర్యాన సంతాప సభ జరిగింది. శ్రీ అప్పారావుగారి చిరకాల స్నేహితులు, వారి

*"వారు విజయనగరంలో శివసాయుజ్యం పొందిన దినములలో నేను మదరాసు విశ్వవిద్యాలయములో 'రీడరు'గా వుంటిని. అప్పుడు ఆండర్సన్ హాలులో పెద్ద సానుభూతిసభ చేస్తిమి. అప్పారావుగారి 'కన్యక' అనే ఖండకావ్యం ప్రత్యేకంగా ప్రకటించి పంచితిమి. మన ఆంధ్రులలో ఆనాడు చెన్నపురిలో వుండిన పెద్దలంతా వచ్చిరి. సర్. హోర్మొల్డు స్టూవర్టుగారున్ను, శ్రీమాన్ ఎస్. శ్రీనివాసయ్యంగారున్ను సానుభూతి వచనములు వ్రాసిరి. "చాణుక్యుని, యుగంధరుని జ్ఞాపకము చేసిన మహనీయుడు"ని పలువురు ప్రశం సించిరి. అట్టి మహనీయుని భరవసా ఆంధ్రులకు పోయినదని శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు చాలా వగచిరి. "మహాధనికుడు కాగలిగిన పరిస్థితులలో వుండిన్ని సంస్థానమునకు ఋణపడి గతించినవాడని" శ్రీమాన్ శ్రీనివా సయ్యంగారు తమకు విజయనగరం పెద్ద దావా నడిపించుటలో గలిగిన అను భవముతో అనిరి" డాక్టరు శ్రీ బుర్రా శేషగిరిరావు, ఎం. ఏ., పి. హెచ్.డి.

అభిమానులు అగు శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు సభకు అధ్యక్షత వహించారు.

ఆనరబుల్ సర్ హోరాల్డు స్టూవర్టు

శ్రీ అప్పారావుగారి మృతికి తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియచేస్తూ ఆనరబుల్ స్టూవర్టు పంపిన సందేశాన్ని శ్రీనివాసయ్యంగారు సభవారికి చదివి వినిపించిరి. "శ్రీ అప్పారావు పంతులుగారి మరణమునకు సానుభూతి తెలుపడానికై సభ జరుగుతున్నట్లు నాకిప్పుడే వర్తమానం వచ్చింది. చాలా జరూరుపనులు వుండడంవల్ల నేను సభకు హాజరుకాలేకపోతున్నందుకు నాకెంతో దిగులుగావుంది. అప్పారావుపంతులువంటి మహాపండితుని కోల్పోయినందుకు దురపిల్లుతున్న తెలుగువారి సంతాపములో నాకూ భాగమున్నది."

ఈ దిగువ సంతాపతీర్మానమును సభవారు దుఃఖసూచకముగ కొన్ని నిముషములు మౌనముగ నిలబడి ఏకగ్రీవముగ ఆమోదించారు:

"శ్రీ గురజాడ అప్పారావుగారి మరణంవలన తెలుగు సాహిత్యమునకు యెంతో నష్టం వాటిల్లింది. వారి కుటుంబానికి యీ సభవారు తమ సంతాపాన్ని తెలియచేస్తున్నారు."

---

గారు ఆంధ్రపత్రికలో ప్రకటించిన వ్యాసమునుండి మీది వాక్యములు ఉదాహృతములు.

సంతాపసభజరిగిన తేదీ 8, డిసెంబరు. మహాకవి సంస్మరణ సంచికను ప్రకటించుటకు విరాళములకోసము విజ్ఞప్తిచేయగా సభలో అయిదువందల రూపాయలు వెంటనే వసూలయినవి.

## శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి

సంతాపతీర్మానాన్ని ప్రతిపాదిస్తూ మద్రాసు ప్రభుత్వ తెలుగు ట్రాన్సలేటరు శ్రీ భానుమూర్తిగారిలా ఉపన్యసించారు:

"శ్రీ అప్పారావుగారి ఉపజ్ఞమాత్రమే గొప్పదికాదు; ఆయన హృదయం నవనీతంవంటిది. అనేక శాస్త్రాలలో నికటమైన పాండిత్యమూ, అపార విజ్ఞానసంపత్తిగల మేధావులు. తమ స్నేహితులను హృదయమిచ్చి ప్రేమించేవారు. సోదర ప్రజానీకంపట్ల ఆయనకు గల ప్రేమ యెనలేనిది. డాబూ, దర్పమూ యేకోశానా యెరగనివ్యక్తి. మిత్రులైననూ, శత్రువులైననూ, వారి వారి సుగుణములను సరిసమానముగా గుర్తించి శ్రీ అప్పారావు పంతులుగారు వారిని మన్ననచేసేవారు. వారితో పరిచయమైతేచాలు; కలిగిన ఆకాస్త పరిచయమూ యితరుల ప్రేమను, గౌరవాన్నీ సదా పొందుతూ వుండేది. దీనికి, శ్రీ అప్పారావుపంతులుగారి సుగుణసంపత్తియే కారణం."

శ్రీ అప్పారావుగారి మృతివలన, దేశము ఒక ఉత్తమ పుత్రుని కోల్పోయినదనీ, తెలుగువారొక ఆత్మీయుని పోగొట్టుకొన్నరనీ చెబుతూ శ్రీ భానుమూర్తిగారు గ్రాంథిక, వ్యావహారిక భాషావివాదములను ప్రస్తావిస్తూ యిలా అన్నారు:

"వ్యావహారికభాషావాదానికి ఆయన నాయకులు. నేనూ నా మిత్రులమూ దీనికి వ్యతిరేకులము. వారికీ, మాకూ తీవ్ర భేదాభిప్రాయాలుండేవి. రవీంద్రనాథ్‌టాగూరు యే భాషలో అయితే, బెంగాలీ సాహిత్యాన్ని సృష్టించారో, అట్టి

భాష మన తెలుగు సాహిత్యానికెంతో ప్రయోజనకారి. ప్రజలను విద్యావంతులను చేయడానికీ, దేశ అభివృద్ధికీ, జాతీయాభ్యున్నతికీ యిట్టి భాషా సాహిత్యాలెంతో అవసరం."

శ్రీ అప్పారావుగారు రచించిన ఖండకృతుల ప్రాశస్త్యమును ఉపన్యాసకులు వుగ్గడిస్తూ, ప్రజలను విద్యాసంపన్నులను చేసే, జాతీయాభ్యున్నత్యాన్ని సాధించే రచనా విధానాన్ని రవీంద్రునివలె, శ్రీ అప్పారావుపంతులుగారు కొనసాగించారని యిలా అభిభాషించేరు:

"శ్రీ అప్పారావుగారి కవితాశక్తి మహత్తరమైనది. విశ్లేషించిచూసే దృష్టీ, తార్కికశక్తీ, తమ ఆశయాల కనుగుణంగా రచించే నేర్పూ ఆయనకు కలవు. తమ ఆదర్శాలేమో, వాటిని సాధించడానికి ఏమి చేయవలెనో తెలిసిన ఆత్మశక్తీ, చైతన్యమూ గల రచయిత."

## శ్రీ హరిసర్వోత్తమరావు

శ్రీ అప్పారావుగారి మృతిపట్ల తమ గాఢసంతాపాన్ని తెలియచేస్తూ శ్రీ *ఆర్. వి. సుబ్బారావుగారు పంపిన లేఖను శ్రీ హరిసర్వోత్తమరావుగారు సభలో చదివారు.

అనంతరం, శ్రీ హరిసర్వోత్తమరావుగారు ఉపన్యసిస్తూ శ్రీ అప్పారావుగారు నాయకత్వంవహించిన వ్యావహారికభాషావాదమునకు తాము వ్యతిరేకులమే అయినా, శ్రీ అప్పారావుగారిలో గల రెండు ఉత్కృష్టగుణములను ఆయన శత్రువులు

* రెంటాల వెంకటసుబ్బారావుగారు; వకీలు.

సైతము మెచ్చుకోక తప్పదన్నారు: "గొప్ప గొప్ప పండితులకు సైతం, తమ వాదమును నచ్చజెప్పి, తమకు సుముఖులుగ చేసుకుంటూ వారిని మార్చేశక్తి శ్రీ అప్పారావుగారికి వుంది. తమ వాదానికి తామే ఆదర్శముగ నిలబడి కావ్యరచన సాగించడమనే ఉత్కృష్ట ఆశయాన్ని ఆయన సాధించారు.

మరికొన్ని సంవత్సరాలు ఆయన జీవించి, తాము అవలంబించినరీతులలో రచనలను అధిక సంఖ్యాకంగా సృష్టించివుంటే, ఈసరికి, ఆయన తెలుగుదేశానికి రవీంద్రులయేవారు."

* ఆనరబుల్ శ్రీ శర్మ

"శ్రీ అప్పారావుపంతులుగారు మరికొన్నేళ్ళు సాహిత్య రచనలోనే తమ జీవితకాలమును గడిపివున్నట్లయితే, ఈపాటికి ఆంధ్రసాహిత్యం మహా సంపన్నవంతమై వుండేది. ఆయనకు అనేక యితర కార్యకలాపాలు వుంటూ వుండేవి. మీదపడ్డ యీ కార్యభారమంతా తొలగి యిక తీరిక చిక్కింది కదా అనుకునేసరికి, సాహిత్యసేవ మిక్కుటముగా చేసే అవకాశం తిరిగి లభించిది కదా అని ఆశించేతరి, ఆకస్మికంగా మృత్యువు సమీపించింది. ఇటువంటి దురదృష్టకర సంఘటనవల్ల ఆంధ్ర దేశానికి తీరని నష్టం వాటిల్లింది. నిజంగా యిది తెలుగువారి దురదృష్టమనక తప్పదు.

ఇ తవరకూ వచ్చిన సాహిత్యం ప్రజలకు చేయవలసిన సేవ చేయతగ్గంత చేయలేక పోయిందనీ, దీనికి అనేక కారణాలు

* శ్రీ బయ్యా నరసింహ శర్మ.

కలవనీ, దీనిని సంస్కరించి నూతన దృక్పథంతో ముందు అడుగు వేయాలనీ గమనించినవారు అరుదు. ఇట్టి వినూత్న మార్గములను అన్వేషించి కొత్త కొత్త పోకడలుపోయి ప్రజలకు సాహిత్యాన్ని సన్నిహితంగా తెచ్చినవారు శ్రీ అప్పారావు పంతులుగారు. ఆయన ఈ మార్గంలో మహోత్కృష్ట విజయాన్ని సాధించారు. మాతృభాషకు, సాహిత్యానికి యింతటి ఆత్మస్నేహితులు మరొకరు లేరు."

అనంతరం సానుభూతి తీర్మానాన్ని బలపరుస్తూ వొక పండితుడు తెలుగున వుపన్యసించాడు.

అధ్యక్షుడు

ఉపన్యాసకుల పలుకులలో అతిశయోక్తి లేపీ లేవని చెబుతూ సభాధ్యక్షులు శ్రీ యస్. శ్రీనివాసయ్యంగారిలా అన్నారు: "అప్పారావుగారు సునిశిత విమర్శకులు. ఇతరుల రచనలనే కాదు; తమ రచనలను సైతం వారు విమర్శించుకుని చూసుకునేవారు. కావ్యవస్తువులోనూ, రీతిలోనూ ఆయన ఆదర్శముల్లా పరిపూర్ణతను సాధించడం."

తమకూ, శ్రీ అప్పారావుగారికీగల స్నేహాన్ని గురించి ముచ్చటించి. అధ్యక్షులు కొన్ని మధురస్మృతులను పేర్కొన్నారు. విజయనగరం పెద్ద దావా జరుగుతున్న సందర్భంలో ఆయనతో తాము వారి లైనులో కొన్నాళ్ళు గడపే అవకాశం లభించిందని చెపుతూ శ్రీ శ్రీనివాసయ్యంగారిలా అభిభాషించారు: "సంస్కృత, ఆంధ్ర ఆంగ్లభాషా సాహిత్యాలలో, శాసనపరిశోధనలో పురావస్తుతత్వశాస్త్రంలో ఆయనకుగల

జ్ఞానం అపారం. ఆయన విషయపరిజ్ఞానం నన్నాశ్చర్యచకితుణ్ణి చేసింది. సాహిత్యపు పొకడలనే కాక, లోకమున మనుజుల ప్రవర్తనను, తీరుతెన్నులను, స్వభావాన్ని ఆకళించుకున్న రచయిత శ్రీ అప్పారావుపంతులు. ఆయనతో అయిదారు నిముషాలు ప్రసంగిస్తే చాలును, ఆయన నఖశిఖపర్యంతమూ మహాపండితుడనీ, గొప్ప మేధావి అనీ మనకు బోధపడుతుంది. ఆయన సాహిత్యసేవయే, పరిశోధనమే జీవిత పరమాశయంగా ఉపలక్షించిన రచయిత. పరిశోధనలో మిక్కుటమగు ఆసక్తి వలన, ఎక్కువ ఖండకృతులను రచించే వ్యవధి ఆయనకు లేక పోయింది. ఇంతటి ధీశాలి యింకా అధికంగానే రచనలుచేసే అవకాశం వుందిమరి. కాని సంస్థానవ్యవహారాలు ఆయనకు ఊపిరాడనీయ లేదు. విజయనగర రాజ కుటుంబీకు లాయనకు యెంతో ఋణపడ్డారని చెప్పవచ్చును. ఆయనతో పరిచయ మౌతున్నకొద్దీ, ఆయన మనకు సన్నిహితులయేవారు. మానవునిగా ఆయనలోగల లోపములకంటె, సుగుణములనే మనం దర్శించగలం."

అధ్యక్షుని ఉపన్యాసానంతరం, మద్రాసు యూనివర్సిటీ రీడరు శ్రీ బి. శేషగిరిరావుగారు సభవారు కావించిన సంతాప తీర్మానాన్ని, శ్రీ అప్పారావుగారి కుటుంబమునకు అందచేయ వలసినదిగా సూచించిరి.

# * శ్రీ గురజాడ అప్పారాయు స్మృతి

కోకిలా ! పారిపోతివె కోర్కెలన్ని
వమ్ముజేసి, శోకమ్మున మమ్ముముంచి
చూపులకు నందరానిదై చొరనశక్య
మైన మరుభూమికొచ్చితే మందు నిన్ను
శీతకాలమ్ము నందెట్లో చిక్కి స్రుక్కి
చాటుమాటున దాగుండి సరసమగు వ
సంతకాలము వచ్చెను నంతవరకు
ఓపికను పట్టలేవైతివే ! ప్రియసఖా !

వెఱ్ఱిపడియెదుగాని యీ విధము క్రొత్త
ప్రకృతి మార్గమ్ములకు నడ్డువచ్చుచుంటె !
వేసవి చనంగ, దాని వెన్వెంట వచ్చు
శీతకాలము రాకుండ, జేయగలవె !

దివ్యపథా నీదు గానమ్ము తీపి వీర
లకు రుచింపక పోయెను, వికల మతిని
"కొయ్యబొమ్మల" నే మెచ్చుకొనెడి వీరి
మతుల కెట్లెక్కనేర, "కోమలులపాట" ?

అంతమాత్రాన వీరిపై నలుగనేల ?
వెలుగుచీకటియొక్కచో వెలయుగాదె ?
ప్రకృతి వైచిత్ర్య మిట్టుల బరగ, మమ్ము
నలుకమైవీడు నిన్నేమి యనగలమయొ ?

*శ్రీ బసవరాజు అప్పారావుగారు రచించిన పద్యములు.

ముందువచ్చు వసంతమ్మునందు నీదు
క్రొత్తగీతము విన నెంతో కోర్కెనుంటి
నింక నేమి వసంతమీ యిగురుపాట
వినపడదుకాదె యింక మాపీనులకును ?

మరచిపోకుము నెచ్చెలీ మమ్ము, దలపు
మమకులలరి చేష్టలు దక్కియాలకించ
లీనమై హాయి, నీదివ్య గానరసము
చిలుకునప్పుడు నీదు నెచ్చెలులమంచు !

## వాగనుశాసనులు శ్రీ గిడుగు

పర్లాకిమిడి,
5 డిసెంబరు, 1915

ప్రియమైన రామదాసూ,

ఎంత విషాదకరము ! అతను గతించినాడు ! ప్రియమైన ఆత్మ ! నీవలెనే, నాకూ దుఃఖం పొంగుకువస్తున్నది. నీ విచారములో సంగోరుభాగమును పంచుకుంటున్నాను. నా అత్యంత ప్రియమిత్రుడు పరమపదించినాడు !

ఎలాగవున్నదో చూసివద్దామని విశాఖపట్నం వెళ్లాను. అదే ఆఖరుసారి అతన్ని చూడడం. నే నతన్ని చూడ్డానికి వెళ్లినపుడు డాక్టరు నాకిలా సలహాయిచ్చాడు: "మీరు యెదట కనిపించేసరికల్లా ఆయన వుద్రేకంపట్టలేక పోతున్నారు. అదే

కొన్ని సానుభూతి లేఖలను యిందు ప్రచురిస్తున్నాము.

పనిగా, జబ్బుమాటమరచి మీతో సాహిత్యగోష్ఠి చేస్తున్నారు. చారిత్రకవిషయాలను గురించీ, సారస్వతాన్ని గురించీ చర్చలు జరుపుతున్నారు. విపరీతమైన అలసట కలుగుతున్నా లెక్క చేయడం లేదు. ఇలా అయితే ఆయన ఆరోగ్యం మరీ పాడవు తుంది కద!"

డాక్టరు, అతనికి ఉత్తరాలు వ్రాయవద్దని నాకు చెప్పాడు. నాటినుంచీ, అతనికి ఉత్తరాలు వ్రాయడం మానుకున్నాను. జబ్బు నిమ్మళిస్తుందికదా, ఆరోగ్యం తిన్నబడుతుందికదా అని ఆశిస్తూ వుంటిని. కాని యింత త్వరలోనే మరణం ముంచుకు వస్తుందనుకో లేదు.

నీ దస్తూరీలో వున్న అతని ఉత్తరం ఇరవైతొమ్మిదో తేదీన కాబోసు పోస్టులోవేశావు. అది, అతను, చెప్పగా నువ్వు వ్రాసిన ఉత్తరంకదూ! అవును, అదే కట్టకడపటి ఉత్తరం!

అతని మరణంతో వొక గొప్పవ్యక్తిని, వొక పరోప కారపరాయణుని, మహాపండితుని మన దేశం పోగొట్టు కొన్నది.

మీ నాయనమ్మను తలచుకొన్నప్పుడల్లా నా హృదయం ద్రవించిపోతున్నది. గుండె చెరువవుతున్నది. పాపం, ముసలి తనంలో యెంత విపత్తు! ఏమని చెప్పి ఆమె దుఃఖాన్ని నివా రించగలం! దుఃఖమును ఆచుకొనేశక్తిని భగవంతుడు ఆమెకు ప్రసాదించుగాక. మీ తల్లిగారినీ, నాన్నమ్మనూ, అప్పచెల్లె ళ్ళనూ వోదార్చి, నువ్వు ధైర్యముతో వుండవలెను.

మానాన్నగారు పోయేసరికి నాకు పధ్నాలుగేళ్ళు మాత్రమే. దుఃఖం పట్టలేకపోయాను. అవును, నాకింకా జ్ఞాపకంవుంది, దుఃఖిస్తోన్న నన్ను చూసి దుఃఖం పట్టలేక అప్పారావు భోరున దుఃఖించసాగేడు. అదే నన్ను ఉపశమింప జేసింది.

తెలుగు ప్రజల స్మృతిపథంలో అప్పారావు సదా జీవిస్తాడు. చనిపోయినప్పటికీ అతను జీవిస్తున్నాడు. అతన్ని తలచుకోవడమంటే మన జీవితములలోని అత్యంత ఆనందమయ సంఘటనలను మన స్మరణకు తెచ్చుకోవడమే.

*Apparao will live in the memory of all Telugu people. He is living though dead. To think of him is to recollect the happiest incidents in our lives.*

*Yours affectionately*

*G. V. Ramamurti*

## మిస్టర్ జె. ఎ. ఏట్సు

4 సౌత్ పెరేడ్

బెంగుళూరు

24 డిసెంబరు '15

ప్రియమైన శ్రీరామదాసుగారూ,

......మీ తండ్రిగారి మరణవార్త విన్నంతనే నా ప్రగాఢ సానుభూతిని మీకు అందచేయవల్సిందిగా రావు సాహేబ్ శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారిని కోరితిని. మీ నాయనగారి ఆప్తమిత్రులు, బంధువులూ శ్రీరామమూర్తి పంతులుగారిని తప్పిస్తే నేను మరెవ్వరినీ యెరుగను.

ఈ విషాదవార్తను నేను మొదట నమ్మలేకపోయాను. ఇది నిజంకాదనుకున్నాను. ఏమీ అంటే ఇలాటి దురదృష్టకర సంఘటన జరగకూడదనీ, జరగదనీ నా మనస్సు ఊహిస్తూ రావడమే నే నీ వార్తను విశ్వసించకపోవడానికి హేతువు. మొన్న మొన్ననే యీమధ్యనే ఆయన నాకు లేఖ వ్రాశారాయె! తరవాత తెలుగు వ్యావహారిక భాషమీద ఆయన వ్రాసిన మెమోరాండము పన్నెండు కాపీలు పంపారాయె! తెలుగు భాషా సంస్కరణకు నడుముకట్టి అహోరాత్రాలు కృషిచేసిన మహాపండితుడు పరమపదించడం తీరని లోటు. అంతటి హాస్య రస ప్రధానమైన గొప్ప నాటకాన్ని రచించి, సంస్కరణోద్య మాన్ని శక్తివంతమైనదానినిగా చేసిన ప్రతిభాశాలి ఆయన. ఆయనకు బదులుగా ఆయన రచనలు యెల్లకాలమూ జీవి స్తాయి. మహత్తరమైన ప్రయోజనమును సాధించి, ఉదాత్త ఆశయములకోసం ఆయన మరణించారు. ఆ ఆశయములు నెర వేరినవి. కనుక ఆయన లేరనే దిగులు పడనక్కరలేదు. భవి ష్యత్తులో వాక్కొక్క యేడాదీ పైబడుతున్నకొద్దీ మానవులు గతంవెనుక కొకసారి తిరిగి చూసుకుని నమ్రతతో, గౌరవముతో మీ నాయనగారికి జోహారు లర్పిస్తారు. రచయితగా, పండితునిగా, దేశ భాషా సంస్కరణోద్యమ ఆద్యులుగా లోకము ఆయనకు హారతులు పడుతుంది.

ఆయనతో నాకు పరిచయం లభించడం ఎంత అదృష్టం! తెలుగు భాషా సాహిత్యములనుగురించి యెన్నో విషయము లను తెలుపుడుచేస్తూ ఆయన నాకు లేఖలు వ్రాస్తూవుండేవారు.

# వంగదేశీయ ఆంధ్రసమితి

27, భవానీచరణ్ దత్తాలేన్,
కలకత్తా, 14 డిసెంబరు '15

*అయ్యా,

డిసెంబరు పన్నెండవ తేదీన వంగదేశీయ ఆంధ్రసమితి యను పేర బరగుచున్న బంగాళా దేశము ఆంధ్రసంఘముకూడి, కీర్తిశేషులగు గురజాడ అప్పారావుపంతులుగారు ఆంధ్ర దేశమునకు చేసిన మేలు అతిశ్లాఘనీయమని కొనియాడుచు ఆంధ్ర కవి ప్రపంచమున నూతనాదర్శములతో ప్రకాశించుచున్న ఆంధ్ర ప్రపంచము కోలుపోయిన సత్తిమునిజ్ఞాపకార్థము ఈసభకూడిన దనియు వారి యకాలమరణమునకు మిక్కిలి చింతించుచున్నామనియు, నిలచి, నిశ్శబముగా తీర్మానించిరి.........

* విజయనగరములో వున్న ఆంధ్ర సాహిత్యసంఘము కార్యదర్శి పేరున వచ్చిన సానుభూతి ఉత్తరం. వంగదేశీయ ఆంధ్రసమితి సహాయకార్యదర్శి శ్రీ పండ్రంగి కేశవరావు గారు. విజయనగరములోని ఆంధ్రసాహిత్య సంఘమును స్థాపించినవారు శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారు.

# మిస్టర్ మార్క్ హంటర్

ఆండర్సన్ హౌస్
నుంగంబాకం
మద్రాసు
9 డిసెంబరు '15

డియర్ మిస్టర్ రామదాసు,

నా మిత్రుడు శ్రీ అప్పారావు మరణవార్త విని క్రుంగిపోయాను. ఆయన సాధించినది ఉన్నతమైనది. దక్షిణ భారత దేశములోగల మేధావులలో పండితులలో ప్రథమ శ్రేణికి చెందిన వ్యక్తి. తన రచనలతో తెలుగుభాషా సారస్వతములకు మెనలేని సేవచేసిన రచయిత. ఆయన ఉద్యమ స్వభావమును కొందరు అపార్థము చేసుకొంటే చేసుకొందురుగాక! కాని ఆయన తన ఉత్తమ లక్ష్యసాధనకు యెడ తెరిపిలేని పోరాటమును నడిపినాడు. ద్రవిడభాషలకు, వాఙ్మయమునకు ఆయన మరణంవలన తీరనినష్టము వాటిల్లినది.

*

*

# నివాళి

* ఆయన మన ఆంధ్రులలో మాకు ముందటితరము వారిలో చాలా ప్రసిద్ధపురుషులు...తనమాట చెల్లివచ్చిన చోటనల్లా మన ఆంధ్రులకు, ఆంధ్ర సంస్థలకు సాయపడిన, సిసలైన దేశాభిమాని... "దేశాభిమానం నాకు కద్దని వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్, పూని యేదైనాను వొకమేల్ కూర్చి జనులకు చూపవోయ్!" అని తన ముత్యాలసరములలో పాడి నట్లు తాను లోకోపకారమని నమ్మిన 'వ్యావహారిక భాషోద్ధరణ' మనే ఉద్యమమునకు ధారపోసిన మహితాత్ముడు. "నాది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను" అని ప్రవచించిన శ్రీ అప్పారావు పంతులు గారు నాకు గురుతుల్యులు.

♦ ఒకసారి మనోహరమగు స్త్రీలపాతపాట ఒకటి అప్పారావుగారి చెవినిబడి మనసున క్రొత్తసంగీతము తిరుగగా, తెలుగున ఒక క్రొత్త ఛందము నడిపింపవలెనని సంకల్పముదయించెను. 1910లో బరంపురమున జరిగిన నానావర్ణ సహాపంక్తి భోజనములో అప్పారావు పాల్గొనినాడు. ఆ సంవత్సరమే తోకచుక్క పొడిచినది. ఒక విచిత్రమైన భావమథనమున అప్పారావు రసిక చిత్తమున నుండి ఒక క్రొత్త కవితావేశము రూపు కట్టినది...ఈతని కావ్యముల పాత్రలు ఒకసహజ భావో

---

* డాక్టర్ శ్రీ బుర్రా శేషగిరిరావుగారు.

♦ శ్రీ కొంపెల్ల జనార్దనరావుగారు.

ప్రదేశములో ఈతనివలెనే, కావ్యౌచిత్యమును కుంటుపడ నీయక మెరుగుదేరునట్లు సంస్కారాశయముల వెలిబుచ్చెను.

♦ ఇంగిలీషు ప్రభుత్వం సుస్థిరంకాగానే, దిగజారుతున్న ఆర్థికపరిస్థితులు బట్టబయలైనాయి. ప్రజలు అన్నంలేక మాడి పోతున్నారనీ, ఈ దుస్థితి ప్రజలకు కలగడం మన దుష్టసాంఘిక పరిస్థితులవల్లనేననీ మనసంఘం మరామత్తు అయి, ప్రజాప్రభుత్వ స్థాపనమై, పరప్రభువుల స్వచ్ఛందవిహారం కట్టించబడితేనే గాని ప్రజలకు మరి ముక్తి లేదని ప్రజల్లో కొంతయలజడి కలిగింది...అంతవరకూ నిరసించబడ్డ జాతీయ సారస్వతం తిరిగి ప్రజలదృష్టి నాకర్షించింది...ప్రజాసామాన్య సారస్వత రక్త ధ్వజం ఎత్తబడింది...ఈ రక్తధ్వజాన్ని ఎత్తినవారిలో నగ్రగణ్యులు గురజాడ వేంకట అప్పారాయకవి.

* గురజాడ అప్పారావు పంథొమ్మిదివందల పదిహేనులో చనిపోయినా పంథొమ్మిది వందల పదిహేను తరువాతనే జీవించడం ప్రారంభించాడు. కాల్పనికోద్యమంలో ఉన్న ఉత్తమ లక్షణాలన్నీ స్వచ్ఛమూ, నిసర్గ సుందరమూ అయిన ఆయన వాణిలో కనబడతాయి. సామాన్యుల గాధలూ, సామాన్యుల మాటలూ, కావ్య ప్రాంగణాన ప్రవేశపెట్టడం ఆయన గొప్పతనం. ఆ 'ముత్యాలసరం' కూడా అలాగే అమరింది! ఆ ఛందస్సు తెలుగువాడి కష్టసుఖాలూ, కథలూ ఎంత బాగా చెప్తుంది! "పాట లాధరి చెట్లచేమలకై పాటపాడితే తాటి వనమున ఆగి చంద్రుడు తాను చెవియొగ్గడమూ",

♦ శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు.

* శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు

"మంచి చెడ్డలు రెండే కులములు; మంచి అన్నది మాల అయితే మాల నే నౌదున్" అని చాటడమూ "నలుగురు కూర్చుని నవ్వే వేళల పుత్తడిబొమ్మను పూర్ణమ్మను ఒక పరితలచి" అవన్నీ పలికించడమూ, "పెరిగి విరిగితి, విరిగి పెరిగితినని స్వంత కష్టసుఖాలు తలపోసుకుని వాపోవడమూ, "ప్రేమ కలుగక బ్రతుకు చీకటి" అని ప్రేమికుడు కావడమూ ఇవన్నీ ఆ క్రొత్త రోజుల్లో యువకవుల హృదయాలకు ఆనంద పక్షాలు తొడిగి, గూటి మెరుగనివాటికి కొండంత జీవితాకాశాన్ని చూపెట్టాయి. వీరి రచన లన్నిటిలోనూ వీరేశలింగం మానవోద్యమ ప్రభావమే కనబడుతుంది.

* గురజాడ అప్పారావు పంతులుగారు సంస్కృత ఆంధ్ర ఆంగ్లభాషలలో నిష్ణాతులు...ఆయన సృష్టించిన పాత్రలు మానవత్వంతో నింపినట్టివి. ప్రాణమున్న ప్రతివాక్కరిలోనూ అవి జీవించి, జీవితాన్ని ఉత్సాహవంతం చేస్తాయి. మానవత్వంతోనూ జీవితంతోనూ పరిపూర్ణమైన రచన కన్యాశుల్కం. దానిలోని స్త్రీలూ, పురుషులూ దయాదాక్షిణ్యాలతోను, విపరీతాలతోను, అయుక్తాలతోను, క్రౌర్యాలతోను, కుయుక్తులతోను, పవిత్రతతోను, వంచకత్వంతోను తిరుగులాడతారు. ప్రకృతి – ఆచారం హేతువు – సంప్రదాయం, అభిప్రాయం, ఛాందసత్వం ఒకదానితో వొకటి తీవ్రసంఘర్షణలకు తలపడ్డ జీవిత వెల్లువలతో యిది నిండి తొణకిసలాడుతున్నది.

* శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు.

♦ మహాకవి గురజాడ అప్పారావుగారి గేయాలలో తేట తెనుగు భాష తియ్యదనము చక్కగా ద్యోతక మవుతాయి. మృదుమధురమైన పదాలను ఏరి కూర్చడంలో గురజాడ వారి కున్న ప్రతిభ "ముత్యాల సరాలు" చాటుతాయి. సరళమైన శబ్దాలకు పదునుపెట్టి జతచేర్చి తాము అంద జేయాలనుకున్న భావాలను చదువరుల హృదయాలకు హత్తునట్లుగా చెప్పగల గొప్పశిల్పి అప్పారావుగారు. పూర్ణమ్మ, కన్యక మొదలయిన పాటలను చదివితే మహాకవి రచనా పాటవం చక్కగా స్ఫురిం చుతుంది.

గురజాడవారి "దేశభక్తి" గేయం, జాతీయ గీతా లన్నిటిలోకి అత్యుత్తమమైనదిగా నేను భావించుతాను. బ్రిటిష్ వాళ్ళ జాతీయగీతమైన "గాడ్ సేవ్ ది కింగ్"లో సామ్రాజ్య వాదుల అహంకారం ద్యోతకమవుతుందే గాని, మానవత్వం గోచరించదు. భారత దేశంలో ఉత్తమ జాతీయ గీతాలుగా ఎంచబడుతున్న 'వందేమాతరం', 'జనగణమన' లలో కూడ మాతృభూమిని కీర్తించడం వుందేగాని, ప్రజానీకంపై దృష్టిని కేంద్రీకరించవు. "దేశమంటే మనుషులోయ్" అని ఎలుగెత్తి చాటిన అప్పారావుగారి గీతం వాటన్నిటికంటే మహోన్నతమైన దనడంలో సందేహం లేదు.

"దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్;

---

♦ శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు

"పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్!"

అనే చరణంలోనూ

"స్వంత లాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్,
దేశమంటే మనుషులోయ్!"

అనే చరణంలోనూ అప్పారావుగారు మానవత్వం యొక్క ఔన్నత్యాన్ని నిరూపించారు.

"వెనకచూసిన కార్యమేమోయ్?
మంచిగతమున కొంచెమేనోయ్
మందగించక ముందుఅడుగేయ్
వెనకపడితే వెనుకే నోయ్!"

అని మహాకవి ప్రజానీకాన్ని అభ్యుదయమార్గాన నడువమని ఉద్బోధించారు.

"యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయ్!"

"పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్;
తిండి కలిగితె కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్!"

అని మహాకవి ఎలుగెత్తి చాటారు. ఇంత గొప్ప జాతీయ గీతాన్ని మనకందించిన మహాకవి మనవాడవడం నిజంగా ఆంధ్రప్రజల అదృష్టం!

♦ ఏ కవికైనాసరే అతనిచుట్టూ ఒకసమాజం, ఆసమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. ఈ సామాజిక చారిత్రక పరిణామగమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలీ, ప్రతిభాశాలీ అయితే ఈ గమనాన్ని అతడు మరింత వేగవంతంచేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవసంధ్యాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను... భవిష్యత్తు మీాద గురజాడకున్న విశ్వాసానికి నేనిక్కడ నివాళులెత్తుతున్నాను. తక్కినవాళ్ళంతా తెలుగుదేశంలో యోధానుయోధులైతే ఒక్క గురజాడ మాత్రమే ప్రపంచంలో ఎచ్చట ప్రామాణ్యాలకైనా విలువగల సార్వజనీనతను సాధించినవాడు.

ఆధునిక సాహిత్య ప్రపంచంలో తెలుగు దేశపు సరిహద్దుల కవతల అంతర్జాతీయ కవి సమ్మేళనంలో తెలుగువారి తరపున ప్రతినిధిగా నిలువ గలిగినవాడు గురజాడ అప్పారావు ఒక్కడే. కవిగా మాత్రమేకాదు, కథారచయితగా, విమర్శకుడుగా విశేషించి నాటక కర్తగా గురజాడ ధృవతార.

*ముఖ్యంగా నాటకరచన విషయంలో నీవు ప్రదర్శించిన ప్రతిభ సమకాలిక భారత దేశంలోనేకాదు; సమకాలిక

♦ శ్రీశ్రీ

*శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు

ప్రపంచంలోనే గణుతించ దగినట్టిది. నీవు 'కన్యాశుల్కము' నాటకాన్ని - ఒక సమకాలిక సమస్య యితివృత్తంగా - ప్రకటించిననాటికి యూరపు ఖండములోనైనా క్రొత్తనాటకం అంతగా ప్రచారంలోనికి రాలేదు.

♦ అప్పారాయకవి ఆంధ్ర వాఙ్మయానికి ఒక సరిహద్దు. ఈయనతో నవ్యసారస్వతయుగం మొదలైనది...స్వాతంత్ర్యపు టూర్పుపోసిన పరమేష్ఠి. దేశభక్తి అంటే ఏమిటో మొదట తెలియజెప్పిన మహానుభావుడితడే.

* సాంఘిక దురాచారాలను బట్టబయలుచేసి సంఘ సంస్కారాన్ని సాహిత్యంద్వారా, అప్పారాయమహాకవికి పూర్వంగాని, తరవాతగాని ఏ తెలుగురచయితా ఆయన చేసినంత అమోఘమైన సేవ చెయ్యలేదనే నిస్సంశయంగా చెప్పవచ్చును.

దేవుళ్ళూ రాజులూ ధనికులూ ఆక్రమించుకొన్న సాహిత్యాన్ని ప్రజలకు సంపాదించిన మహాపురుషుడు అప్పారాయ మహాకవి. సాహిత్య విప్లవకారకుడై నూతన సంస్కృతిని నెలకొల్పిన మహాపురుషుడు.

అప్పారాయ మహాకవి తెలుగుజాతికి పెన్నిధి! ప్రపంచ కవులకుటుంబానికిచెందిన విశ్వకవి!

♦ శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు

* శ్రీ సెట్టి ఈశ్వరరావుగారు

* ప్రతి విషయంలోను ఇంత స్పష్టమైన దృక్పథం ప్రదర్శించిన మహాకవి వెనుక ఒక మహత్తరమైన శక్తి వుంది. మారుతున్న లోకాన్ని తన రచనల్లో స్పష్టంగా చిత్రించాడు. ప్రాచ్యపాశ్చాత్యసాహిత్య సంప్రదాయాలు మేళవించి, సజాతీయంగా, సహజంగా "క్రొత్తపాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా" జాతిని మేల్కొల్పి విజ్ఞానపథాలకు నడిపే ఉత్తమాదర్శం ఆయన రచనల్లో అడుగడుగునా గోచరిస్తుంది.

ఆంధ్రసాహిత్యంలో ఆయన అభ్యుదయయుగానికి దారి తీసిన మహాకవి. ఆయన ఉత్తమ జీవితాదర్శం ఎల్లప్పుడూ ఆంధ్రజాతి హృదయంలో వేగుచుక్కగా వెలుగొందుతుంది. ఆయన దివ్యవాణి ఆంధ్రజాతికి కర్తవ్యాన్ని ఉపదేశిస్తుంది. ముందుకు నడుపుతుంది. అదే ఆంధ్ర సాహిత్యాభ్యుదయానికీ, ఆంధ్రజాతికీ, అభ్యుదయానికీ, ఆశారేఖ.

* అభ్యుదయ సాహిత్య పత్రిక సంపాదకీయం

## • మహాకవి

గుత్తునా యని జాతిముత్యాల్
గుచ్చినాఁడే మేలిసరముల
ఇత్తునా యని తెలుఁగుఁదల్లికి
ఇచ్చినాఁడే భక్తితో !

నవవసంతము, నవ్యవనరమ,
మావికొమ్మలు కమ్మచివురులు,
పాటపాడెడి పరభృతంబును
ఎవ్వరాపుదురో ?

పొడుపుమలపై రంగవల్లిక
మింటినడుమఁ బ్రచండతేజము
సంజమబ్బులపైని కెంపులు
చూడకుంటిరిగా!

రంగవల్లిక మాయమయ్యెను
చండతేజము మాసిపోయెను
సందెకెంపులు సాగిపోయెను
వెదకుచున్నారా!

కారుచీఁకటి గ్రమ్మినప్పుడె
చదల మబ్బులు కప్పినప్పుడె

• శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించిన గీతం

మిఱుఁగురైనను మెఱయనప్పుడె
వెదకుచున్నారా!

చుక్కలన్నియు సొక్కి సోలెను
గిరులు కదలెను, దిరుగఁబాఁడెను
లోక మోహనమధురగానా
స్వాదమోదమున!

యుగయుగంబులనుండి మ్రోఁగెడు
విశ్వగానవియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని
గీత శీకరమున్!

పాటపాడిన పరభృతంబును
మూఁగవోయిన ముద్దుకోయిలఁ
జిన్ని పికములు చిఱుతపాటలఁ
బిలుచుచున్నవి చూ!



# కొన్ని ముఖ్య తేదీలు

**30-11-1861 :** విశాఖజిల్లా ఎలమంచిలి తాలూకా రాయవరంలో మహాకవి జననం.

**14-8-1883 :** వారి 'సారంగధర' కావ్యాన్ని ప్రశంసిస్తూ "రీస్ అండ్ రయ్యత్" పత్రికా సంపాదకులు శ్రీ శంభుచంద్ర ముఖర్జీ కలకత్తానుంచి వ్రాసిన లేఖ.

**1-4-1884 .** విజయనగరం కళాశాలలో పదో అసిస్టెంటు లెక్చరరుగా నియామకం. జీతం నెలకు పాతిక.

**-1-1886 :** ఎనిమిదో అసిస్టెంటుగా ప్రమోషను.

**-1-1886 :** బి. ఏ; పట్టభద్రత.

**3-3-1887 :** కళాశాలలో 'లీవ్' వుంచుకుంటూనే, విజయనగరం జనరల్ డిప్యూటీ కలెక్టరు కచేరిలో సబోర్డిటం హెడ్‌గుమాస్తాగా ఉద్యోగ స్వీకరణ.

**7-3-1887 :** పై ఆర్డరు వచ్చిన **తేదీ.** ఆర్డరు నెంబరు 560.

**27-10-1887 :** విజయనగరం కాంగ్రెస్ సమావేశంలో ఉపన్యసించుట.

**-10 1887 :** నాలుగో అసిస్టెంటుగా తిరిగి విజయనగరం కళాశాలలో లెక్చరరు పదవి. జీతం నెలకువంద. ఆర్డరు నెంబరు 275.

**20-7-1868 :** విశాఖపట్టణం స్వచ్ఛంద సేవాదళ సభ్యత్వస్వీకరణ. నెం. 225.

**22-6-1889 .** విజయనగరం సంస్థానపు డిబేటింగుసొసైటీకి ఉపాధ్యక్షులుగా ఎన్నిక.

**22-6-1891 :** మూడవ లెక్చరరుగా నియామకం. జీతం నెలకు నూటపాతిక.

**5-6-1896 .** సంస్థాన శాసన పరిశోధకునిగా నియామకం.

**1-1-1897 :** 'కన్యాశుల్కము' మొదటి కూర్పునకు ఉపోద్ఘాత రచన. ఇంతకుముందే నాటకరచన ముగించుట.

-6-1898 : ఆనందగజపతి సోదరి రీవా మహారాణికి ఆంతరంగికకార్యదర్శిగ నియామకం.

24-4-1905 : తండ్రిగారి మరణం.

- -1906 : 'కొండుభట్టీయము' తొలిసారిగా రచించుట.

11-3-1909 : 'కన్యాశుల్కము' నాటకమును యిప్పటికే కొన్ని అంకములను తిరిగి మార్చి వ్రాయుట.

1-5-1909 : "కన్యాశుల్కము" రెండవ ముద్రణకు పీఠిక.

21-5-1909 : వాస్తవిక రచనాలక్షణాలను ప్రతిపాదిస్తూ శ్రీ సుబ్రహ్మణ్యము గారికి లేఖ.

- -1910 . బరంపురంలో నానావర్ణ సహపంక్తి విందు.

- -1910 : 'ముత్యాలసరముల' రచన.

- -1910 కొండుభట్టీయము' రెండవసారి రచించుట.

21-4-1910 : 'బిల్హణీయము' మొదటి అంకము ప్రచురించుట.

24-11-1910 : 'గ్రామ్యశ్రద్ధ విచారణము' వ్యాసరచన.

29-12-1910 : 'ఆకాశరామన్న'కు జవాబుగా వ్యాసప్రకటన.

-4-1911 : 'బిల్హణీయము' రెండవ అంకమును అచ్చొత్తించుట.

27-3-1911 : "నాది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్ట డానికైనా వదులుకోలేను" ఆంధ్రసారస్వత ప్రపంచమున మహాకవి 'మాగ్నకార్టా' ప్రకటన.

23 1-1912 : కలకత్తాలో వంగీయ సాహిత్యపరిషత్తు, మహాకవి గౌరవార్థం చేసిన తేనీటివిందు; సభ.

16-5-1912 : వ్యావహారిక భాషాప్రయోజనం గురించి మద్రాసులో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్తు సభలో ప్రసంగం.

27-6-1912 : తెలుగుభాషలో సాంకేతికపదాల కూర్పుకు ప్రయత్నం.

15-11-1912 : 'కన్యక' ప్రచురణ.

-12-1912 : కలకత్తాలో రవీంద్రునితో సమావేశం.

- -1913 : 'సుభద్ర' పద్య కావ్యరచన.

30-1-1913 : మద్రాసు విశ్వవిద్యాలయంలో "ఫెల్లో" గా నియమించుటకు గవర్నరు అభ్యర్థన.

20-4-1914 : "ద మినిట్ ఆఫ్ డిసెంటు, టు ది రిపోర్టు ఆఫ్ ది తెలుగుకాంపోజిషను సబ్-కమిటీ" ప్రచురణ.

30-10-1915 : 'దించు లంగరు' ప్రచురణ.

30-11-1915 : ఉదయం ఎనిమిదీ ఇరవై నిమిషాలకు విజయనగరంలో మహాకవి నిర్యాణం.



# కొన్ని విశేషాలు

బాల్యంలో శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారితో కలసి "నల" నాటక ప్రదర్శనాలు. మెట్రిక్యులేషను, ఇంటరుమీడియేటు, బి. ఏ; ఎమ్. ఏ; పరీక్షాధికారిగా నియామకం. మద్రాసు విశ్వవిద్యాలయ యావజ్జీవిత సెనేటు సభ్యత్వం. తెలుగు వ్యాకరణ రచనకు కృషి; ఆంధ్రకవుల జీవితచరిత్ర, కళింగ దేశ చరిత్రల రచనకు కావలసిన విషయసేకరణ. విజయనగర సంస్కృత, ఆంగ్ల, సంగీత కళాశాలల అభివృద్ధికి కృషి. కౌన్సిలరుగా పౌరహిత కార్యకలాపాలు. నగరంలో నీటి సరఫరాకు కుళాయిల ఏర్పాట్లకు కృషి. వ్యావహారిక భాషోద్యమవ్యాప్తికి ఆంధ్ర సాహిత్య సంఘస్థాపన. 'ప్రకాశిక' తెలుగుపత్రికకు సంపాదకత్వం.



# కొందరు సమకాలికులు

## శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు :

ఆంధ్ర జాతీయాభ్యుదయానికి పునాదులువేసిన మహనీయులు. రాజమహేంద్రవరంలో 16 ఏప్రియల్, 1848 వ సంవత్సరంలో జననం. 1871 లో రాజమండ్రి ప్రభుత్వపాఠశాలలో ఉపాధ్యాయపదవి. 1876 లో 'వివేకవర్ధని' పత్రికాస్థాపన. సంఘసంస్కరణమే ధ్యేయంగా సాహిత్యరచన. మహిళోద్ధరణ; వితంతు శరణాలయం, పురమందిర నిర్మాణం. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో పండితపదవి. రాజశేఖరచరిత్ర, బ్రాహ్మవివాహం, శారీరకశాస్త్ర సంగ్రహాది శతాధికగ్రంథ రచయిత. వ్యక్తిగా కాక తామే ఒక సంస్థగా విరాజిల్లుతూ ఆంధ్రదేశంలో నూతన చైతన్యం, జాగృతి కలిగించిన యుగపురుషులు. ప్రజోపయోగంకోసం తమ సర్వస్వమును ధారపోసిన మహాపురుషులు. నిర్యాణం : 27 మే, 1919.

## శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు :

ఆంధ్రమును మహత్తరమైన జాతీయభాషగా రూపొందించ ఉద్యమించిన వాగనుశాసనులు. కళాప్రపూర్ణులు. 'ఆదిలాక్షణికుల కందని బహుపద పారిజాత సుమములేరి' వ్యావహారిక భాషావాదమును సంస్థాపించిన శబ్దవేది. పర్వతాలపేటలో 1863 లో జననం. గిడుగు, గురజాడలు బాల్యస్నేహితులు. కొంతకాలం ఉపాధ్యాయవృత్తి. కళాశాలలో ఆచార్యపదవి. సవరభాష కొరకు లిపి, వ్యాకరణముల రచన. 1905 లో సవరబడుల స్థాపన. సవరభాషా కృషికి ప్రభుత్వంవారిచే 1913 లో "రావుసాహెబ్" బిరుదు ప్రదానం. వ్యావహారిక భాషావ్యాప్తికి అనన్యకృషి. పండితగోష్ఠులు, చర్చలు, సభలు; విమర్శనా పూర్వక వ్యాసరచన. రచించిన కొన్ని గ్రంథములు: బాలకవి శరణ్యము, ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము, ప్రాఁదేఁముగుఁ గమ్మ, గద్య చింతామణి మొదలైనవి. నిర్యాణం : 22 జనవరి, 1940.

## శ్రీ ఆనంద గజపతి :

తండ్రి శ్రీ విజయరామగజపతి అనంతరము విజయనగర సంస్థానమునకు అధిపతి. ఆంధ్రభోజుడని కీర్తిప్రతిష్ఠ లార్జించినవారు. సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషలలో దిట్ట; కవి. సంస్కృత ఆంగ్లభాషా గ్రంథములను సామాన్యముగ అందరికీ బోధపడే తెలుగున అనువదింప చేయడానికి వొక ప్రణాళికను ఊహించి, వొక్కొక్క శాఖను వొక్కొక్క పండితునికి అప్పగించినవారు. శ్రీ కోల్లూరు కామశాస్త్రిలుగారు తెలిగించిన గ్రంథపీఠికలో "నన్నయ్య, తిక్కన మొదలగు కవులు, పాండిత్య ప్రకర్ష చూపి కావ్యములను రచించిరి. ప్రబంధములునూ అంతే. పామరుల కక్షమయేభాషలో యీ ఉద్గ్రంథాలను అనువదించండ"ని ఆనందగజపతి ఆదేశించినట్లు కలదు. విజయనగర సంస్థాన చరిత్రను 'ట్రీటీ' అనే పేరుతో గ్రంథముగా వ్రాసిరి. విజయనగరంలో విశ్వవిద్యాలయం నెలకొల్పుటకు కృషి చేశారు. సంఘములోనూ, సాహిత్యములోనూ సంస్కరణమును అభిలషించినవారు. విశాఖజిల్లాలో నాడు జరుగుతూవుండే కన్యాశుల్క, బాల్యవివాహాల లెక్కలను సేకరింపజేసినవారు. కన్యాశుల్కము నాటక రచనకు ప్రోత్సాహించినవారు.

## శ్రీ అలక రాజేశ్వరి :

ఆనంద గజపతితల్లి. భర్త అనుమతిని పొంది యీమె విజయరామ గజపతిని దత్తత చేసుకున్నది. ఆనందరాజుగారి విల్లు ప్రకారము యీయనకు సంస్థానము దఖలు పడ్డది. అట్లు దఖలు పడుటకు వీలులేదనీ, దత్తత చెల్లనేరదనీ, వారసులు దావా తెచ్చినారు. దీనిని విజయనగరం పెద్దదావా, వారసత్వపు దావా అందురు. 1897-1912 వరకు జరిగిన యీదావా మహాకవి సాహిత్యకృషిని హరించి వేసింది. ఈమె పెద్దకూతురు రీవారాణి. ఆనంద గజపతి అక్క.

## శ్రీ విజయరామ గజపతి :

ఆనందగజపతి దత్తత తమ్ముడు. అన్నగారి విల్లుప్రకారము సంస్థానము దఖలు పడగా 1904 '22 వరకూ సంస్థానమును ఏలుబడిచేసిన వ్యక్తి. ఈయన హయాములోనే సంగీతకళాశాల స్థాపింపబడ్డది.

## శ్రీ సి. చంద్రశేఖరశాస్త్రిగారు :

విద్యాధికులు. తమిళులు. రాయవెల్లూరు వీరి స్వస్థలం. విజయనగరం ఆంగ్లకళాశాలకు మొదటి ప్రిన్సిపాలు. అనేకమంది విద్యార్థులకు తమ ఇంటనే భోజన సదుపాయముచేసి, జీతం లేకుండా చదువు చెప్పించిన ఉదారులు.

## శ్రీ కిళాంబి రామానుజాచార్యులుగారు :

సంస్కృత, ఆంధ్ర ఆంగ్లభాషలలో పండితులు. పశ్చిమ గోదావరి జిల్లా పెంటపాడు వీరి స్వస్థలం. శతావధాని. స్వయం ప్రతిభచే రాణించిన వారు. ఎమ్. ఏ., బి. ఎల్. కొంతకాలం హైకోర్టులో ప్రాక్టీసు. శ్రీ చంద్రశేఖరశాస్త్రిగారి అనంతరము, విజయనగర కళాశాలకు ప్రిన్సిపాలయినారు. 1914 లో కాకినాడలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షికోత్సవసభకు అధ్యక్షులు. మొదట గ్రాంథికవాది. తరువాత వ్యావహారికభాషావాది.

## శ్రీ లింగం లక్ష్మాజీ పంతులుగారు :

అఖండ ప్రతిభాశాలి. గ్రీకులాటిను, ఫ్రెంచి, ఇంగ్లీషు సంస్కృతాంధ్ర భాషలలో గొప్ప పండితులు. ఆనందగజపతికి గురువు. కోయభాషకు లిపి కల్పించి, వ్యాకరణమును రచించిన మేధావి. వీరి స్వగ్రామం విజయనగరం దగ్గర పుల్ల కోనాడ.

## శ్రీ జిడ్డు సుందరరావుగారు :

బి. ఏ. పట్టభద్రులు. ఆనందగజపతికి పెర్సనల్ అసిస్టెంటుగావుండే వారు. అప్పారావుగారికి కావలసిన మిత్రులు. వారికి సహాయపడ్డవారు.

## శ్రీ అనాసపురపు రామమూర్తి పంతులుగారు :

సంస్కృతాంధ్ర ఆంగ్లభాషలలో పండితులు. పట్టభద్రులు. మొదట కళాశాలలో ఉపాధ్యాయపదవి. అనంతరం విజయనగరసంస్థానపు దేవస్థానములకు సూపరుంటెండెంటు. నైతికజీవితమును గడిపి పేరుపొందిన ఉద్యోగి.

## శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తిగారు :

పట్టభద్రుడు; చెముడు జమీందారుకు కొంతకాలం ట్యూటరు. అప్పారావుగారి సహాయంతో రాజువద్ద సెక్రటరీ అయి అనంతరం కళాశాలలో లెక్చరరు అయినారు. గ్రాంథికవాది. "అడవిమల్లెలు" మొదలగు ఖండ కావ్యములను రచించారు.

## శ్రీ బాలయ్యనాయుడుగారు :

ఆనందగజపతి కాలములో చెన్నపట్నం, నీలగిరి మొదలైనచోట్లగల జోటుస్టేసనులకు ఏజంటుగా వుండేవారు.

## శ్రీ వెంకటరాయశాస్త్రిగారు :

వీరు శ్రీ చంద్రశేఖరశాస్త్రిగారికి బావమరది. విజయనగరము కళాశాలలో ఫిలాసఫీ లెక్చరర్‌గా వుండేవారు.

## శ్రీ నిష్టల రామశర్మగారు :

శృంగవరపుకోట తాలూకా సోంపురం అగ్రహారీకులు. ఎమ్. ఏ. ప్యాసయినారు. ఆంగ్లమున కవిత్వం చెప్పేవారు. కళాశాలలో లెక్చరర్‌గా వుంటూ ఆనందరాజు అనంతరం ఎస్టేటు రెవిన్యూ సూపర్‌వైజరుగా పని చేశారు.

## శ్రీ వంగ మాధవరావుగారు :

విజయనగరం కళాశాలలో మాథమిటిక్సు ప్రొఫెసరు.

## శ్రీ శ్రీనివాసాచారిగారు :

విద్వాంసులు. ఆనంద గజపతి నెలకొల్పిన నాటక సమాజంలో సభ్యులు. చక్కని గాత్రం. చంద్రహాస అను యింగ్లీషు నాటక రచయిత.

## శ్రీ రాజామణిచెట్టిగారు :

రిటైర్డు డిప్యూటీ కలెక్టరు కుమారుడు. తెనుగున కవిత్వం చెప్పేవారు. బిలియర్డ్సు, క్రికెట్టు ఆటలలో అభిరుచి.

## శ్రీ పి. శేషాద్రిగారు :

మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో కొంతకాలం, కాశీ హిందూ కళాశాలలో మరికొంతకాలం ప్రొఫెసరు. ఆంగ్లమున 'పూర్ణమ్మ' కావ్యంపై చక్కని విమర్శను వ్రాశారు.

## డాక్టర్ శ్రీ బుర్రా శేషగిరిరావుగారు :

విద్యాధికులు. విజయనగరం కళాశాలలో ప్రొఫెసరు. ఎమ్. ఏ., పి. హెచ్. డి., మద్రాసు విశ్వవిద్యాలయములో రీడరు. ఆంధ్రా రిసెర్చి యూనివర్సిటీ సంస్థాపకులు. మహాకవి శిష్యులు. వ్యావహారికభాషావాదమునకు అండగా నిలచినవారు. విమర్శకులు. కళాశాల విద్యార్థులకు మాతృభాషలో వ్యాసరచనయందు తర్ఫీదు యివ్వడానికి ఎట్టి భాషను స్వీకరించవలెనో నిర్ణయింపడానికి మద్రాసు యూనివర్సిటీ నియమించిన కమిటీలో వ్యావహారిక భాషావాదుల తరఫున వీరు వొక సభ్యులుగా నియమితులు.

## డాక్టరు హాల్డ్సు :

మద్రాసుప్రభుత్వ ఉద్యోగులు; శాసన పరిశోధకులు.

## డాక్టరు మిల్లర్ :

సి. ఐ. ఇ. కొంతకాలం మద్రాసుక్రిస్టియను కళాశాలలో ఆంగ్లోపన్యాసకులు; తరువాత కళాశాలాధ్యక్షులు.

## రావుబహద్దర్ శ్రీ ఎ. వెంకయ్యా అవర్ఘళ్ :

ఎమ్. ఏ. పట్టభద్రులు. మద్రాసు ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటు అసిస్టెంటు సూపరెండెంటు; శాసన పరిశోధకులు.

## శ్రీ వై. ఎ. ఏట్సు :

ఆంగ్ల విద్యాధికుడు. కొంతకాలం పచ్చయ్యప్ప కళాశాలకు ప్రిన్సిపాలు. తమిళ, తెలుగుభాషలను అభ్యసించారు. 1906 లో తూర్పు జిల్లాలకు విద్యాధికారిగా నియమితులు. ఉపాధ్యాయ పరిషత్తులను జరిపి చర్చలు సాగించి గిడుగు, గురజాడల వ్యావహారిక భాషా ఉద్యమానికి ప్రోత్సాహం యిచ్చారు.

## శ్రీ శ్రీనివాసయ్యంగారు :

ప్రసిద్ధ న్యాయవాది. మదరాసు హైకోర్టులో అడ్వకేటు జనరలు. అప్పారావుగారి సన్నిహిత మిత్రులు. గొప్ప షేక్స్పియరీయు పండితులు.

## శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు :

పండితులు. వీరి స్వస్థానం నెల్లూరు. జననం : 21 డిసెంబరు 1853. కళాప్రపూర్ణ, మహా మహోపాధ్యాయ బిరుదాంకితులు. ప్రతాపరుద్రీయము, ఉషాపరిణయము మొదలైన నాటకములను రచించారు. విశ్వనాథకవి రాజ ప్రణీత సాహిత్య దర్పణమును తెలిగించారు. గ్రాంథికవాదులు. 1919 వ సంవత్సరపు ఆంధ్ర సాహిత్య పరిషన్మహాసభాధ్యక్షులు. నిర్యాణం : 18 జూన్, 1929.

